

# రామకథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

## 26

### అవసరకార్యములు :

అంత దశరథుడు పట్టరాని ఆనందముతో "బ్రాహ్మణోత్తములారా ! వింటిరికదా , ప్రజాభిప్రాయములు ! ఇక మీరు ఆలసింపక, పట్టాభిషేకమునకు కావలసిన ఉపకరణాలు సమకూర్చుడు. అందుకు తగినఅరుగులు హోమగుండములు, యేర్పరచుడు, అని ఆజ్ఞాపించెను.

వశిష్ఠులవారికి నమస్కరించి, " స్వామీ! వచ్చుటకు వీలుపడినవారు మాత్రమే వత్తురు. దూరప్రాంతపువారికై నిరీక్షించకుడు. పట్టాభిషేకము జరిగిన తరువాత

వారు విని ఆనందింతురు కాన కేకయరాజునకుగాని, జనకునకుగాని తెలుపవలెనను సాకును పెట్టుకొనక, కాలమును పొడిగించక. అతి శీఘ్రముగా ఈ పవిత్ర అభిషేకమునకు అనుజ్ఞ నొసగుడు అని హస్తములుజోడించి, ప్రార్థించగనే,

వశిష్ఠులవారు "మహారాజా! నేను సర్వసిద్ధముగానే యున్నాను. రేపటి దినమే అగ్నిహోత్రగృహములును, పూజాద్రవ్యాదులును, ఓషధులును నూరుకలశములును, సమగ్రమయిన పులితోలును యుంచుటకు ఆజ్ఞాపించి, ఇంతమాత్రమేగాక చతురంగబలములతోను, సర్వశుభలక్షణయుతమైన శత్రుంజయమను ఏనుగుతోను, సర్వాలంకృతమగు ఆబోతుతోను శ్వేతచ్ఛత్రముతోను, ధ్వజముతోను సర్వసిద్ధముగా నుండుటకు యేర్పాట్లు గావించుమని సెలవిచ్చెను. ముహూర్తము రేపటికే అని నిర్ణయమయినట్లు వశిష్ఠులవారు తెలిపినతోడనే,

ప్రజలు పరమానందహృదయులై గంతులు వేసిరి. రాజవీధులు శుభ్రపరచుట. రంగులువేయించుట, తోరణములు కట్టించుట, పందిళ్ళువేయించుట, ఇత్యాది అవసర కార్యములు అతి త్వరగా ప్రారంభించిరి. బ్రాహ్మణులు, ప్రజలు కలకలధ్వనులుచేయుచు కిలకిలనవ్వులు వెలిబుచ్చుచు దశరథుని ఆజ్ఞనుపొంది సభాభవనమును వీడిరి.

పరమానందము :

దశరథుడు, కులగురువుగారైన వశిష్ఠులవారు, మంత్రి, లోనికి వెళ్లిరి. దశరథ మహారాజు కొలువుకూటమునకు శ్రీరాముని రప్పించి పట్టాభిషేకమునకు సంబంధించిన సర్వపద్ధతులను వివరముగా తెలిపి, రేపటి సూర్యోదయమునకు సిద్ధముగానుండవలసిన విధానములు తెలిపి, అందుకు తగిన యేర్పాట్లుదారులను పిలిపించి రామునకు అప్పజెప్పెను.

ఈ వార్త వినిన లక్ష్మణుడు పరమానందముతో పరుగెత్తుకొనిపోయి కౌసల్యాదేవికి తెలిపెను. ఆమె పట్టరాని ఆనందముతో రామరాకకై నిరీక్షించుచుండెను.

కాలము తక్కువయినను అతి శీఘ్రములోనే నగరమంతయు ప్రాకెను. చుట్టుప్రక్కలరాజ్యములకు గ్రామములకు, అతి త్వరగా వ్యాప్తిచెందెను. గ్రామగ్రామముల నుండి పరుగిడుచు వచ్చు జనసంఖ్య మితిమీరెను.

ఇవన్నియు వింటున్న రామచంద్రునకు యేమియు తోచక, నోటమాటరాక, ఆనందమును వెలిబుచ్చక, మౌనమువెలిబుచ్చెను. రామునిచూచి దశరథుడు నాయనా! పట్టాభిషేకమన్న ఆనందము నీలో యేమాత్రము కనుపించకున్నందుకు కారణమేమి? నీవు యువరాజువగుటకు ఇష్టములేదా? లేక రాజ్యభారము ఈ నాటినుండియే నీ తలపై పెట్టతలచితిమని ఒకవిధమైన భయమా?

నీ మనోభీష్టము నెఱవేర్చుమని అనేక విధముల బుజ్జ గించి ప్రశ్నించిన దశరథుని ముఖమును చూచు చూ రామచంద్రుడు,

నాన్నా! మీరెందుకింత తొందరపడుచున్నారో నాకర్థమగుటలేదు. నా ప్రియమైన సోదరులు భరత శత్రుఘ్నులు నాతో లేరు. ఇక తాతగారు అతి దూరమునయుండుటచే వారు రాలేక పోవచ్చును. మామగారు కూడను రాలేక పోవచ్చును. మిగిలిన రాజులు, సామంత రాజులు యెవ్వరును చేరలేక పోవచ్చును. ఇంతమందికి నిరాశ కలిగించి పట్టాభిషేకమునకు పూనుకొనుటకు నామనసొప్పకున్నది. అని నమస్కరించి వినయముగా తెలుపుకొనెను.

అంత వశిష్టులవారు రామా! ఈయూహలు మేము కూడను చేయకపోలేదు. అన్నివిధముల ఆలోచించి ప్రజాభిప్రాయములను కూడను సేకరించి ఈ నిర్ణయమునకు వచ్చితిమి. నీవిక పెట్టిఅడ్డునుచెప్పక మహారాజుయొక్క అభీష్టమును శిరసావహింపుము. అభిషేకము రేపే జరుగవలెను. ఈ నాటినుండియే నీవు నియమమును పాటించవలెను. రాత్రికి పట్టుపరుపులు, మంచములుమాని దర్భశయ్యపై పరుండవలెను. రాత్రికి సీతాసమేతముగా ఉపవాసము చెయ్యవలసి యుండును. తెల్లవారగనే అభ్యంగన స్నానమాచరించి లేత:పసుపురంగు వస్త్రములు ధరి

యుంచి సూర్యోదయమునకే పుష్యమి నక్షత్రమునకు పట్టాభిషేకము పూర్తికావలెను. కాన నీవిక బదులుచెప్పక నీ వసతికి వెళ్లిరమ్మ. అని ఆజ్ఞ యిచ్చినవెంటనే,

తల్లి — కుమారుడు.

రాముడు తండ్రికి, గురువునకు, నమస్కరించి, మారుమాటాడక, సుమంత్రునితో కలిసి వసతికి వెళ్లి సీతకు వార్త తెలిపి అక్కడనుండి తల్లి కౌసల్యా భవనమునకు వెళ్ళి తల్లికి నమస్కరించెను. తల్లి పట్టలేని ఆనందముతో కుమారుని ముద్దాడి అనేక గోవులను సర్వాలంకారముతో సిద్ధముగావించి యుంచిన వాటిని, బ్రాహ్మణులకు యిప్పించి, ఇంకా ఇంకా అనేక విధముల కౌమయనిచేత దానములుచేయించెను.

సుమిత్రా లక్ష్మణ సమేతయైగా కౌసల్య, రాముని తన సరసన కూర్చుండబెట్టుకొని ఒకవైపున ఆనందభాష్పములు తుడుచుకొనుచు, నాయనా! ఈసుసమయమును ఎప్పుడు చూతునా అన్న నాచిరకాలవాంఛ నేటికి పూర్తి ఆయినది. నేను ధన్యురాలను, నా బంగారుపట్టీ! రేపటి నుండియు నీవు యువరాజువు. చిరకాలము జీవించు. ప్రజా క్షేమమును దృష్టియందుంచుకొని సక్రమపాలన సాగించి సత్కీర్తినార్జించి మనపూర్వీకుల ఘనతను నిల బెట్టుము. మీ తండ్రిగారికంటె గొప్పపేరును పొందుము.

ఆనాడే నాజన్మ ధన్యము కాగలదు. నావ్రతములు, ఉప
వాసములు సఫలము కాగలవు.

అని —తములు.

అని తల నిమురుచు అనేక విధముల ఆశీర్వదిం
చుచూ, బోధించుచూ చెప్పిన మాటలను రాముడతి
శ్రద్ధగా వింటూ తమ్ముడైన లక్ష్మణునిచూచి చిరునవ్వులు
చిందులు ద్రొక్కుచు తమ్ముడా నిన్ను ఏరాజ్యలక్ష్మి వరిం
చినదో తెలుపగలవా అనికొంటె ప్రశ్న వేయగనే లక్ష్మ
ణుడు పట్టరాని ఆనందముతో అన్నా నాకు ఏరాజ్యలక్ష్మి
అక్కరలేదు. నీరాజ్యమునందే నీ ఆదేశానుసారము పరి
పాలనా బాధ్యత చేయగలను, అంతే చాలును. అని
అన్నకు నమస్కరించగనే రాముడు లక్ష్మణా! నీవు నా
రెండవ [illegible] కనుక అర్ధరాజ్యభారము నీది. నా తోపాటు
సర్వాలంకృతుడవు కమ్ము. నాబాధ్యతలు, నాభోగభాగ్య
[illegible] అర్ధభాగమునకు అధి
కారమున్నది. నేనేమి అనుభవించినను అందు నీకు అర్ధ
బాధ్యత కలిగియుండును. అని మాటలాడు చుండగా
సుమిత్ర కంటిధారలు విడుచుచూ ఇరువురిని ఆశీర్వ
దించుచూ రామా మీయిరువురి మధ్యనున్నప్రేమ నన్నెం
తగనో ఆనందపెట్టుచున్నది

నా కుమారునకు నీ సేవకంటె వేరు అధికారము
అక్కరలేదు. నీప్రేమ అభిమానములు కలకాలము నా

కొమరునిపై యుండిన అంతియే చాలును, అని మాటలు ముగించెను. అంత రాముడు యిరువురు తల్లులకు నమస్కరించి లేచెను. అతనితోపాటు లక్ష్మణుడు కూడను లేచి, అన్నతోపాటు రామవసతికి వెళ్ళెను.

వ్రతములు :

ఆరాత్రి గురువుగారు చెప్పినటుల ఉపవాసవ్రతములు ప్రారంభించిరి. ఆరాత్రి దర్భాసనములపై శయనించిరి. తెలతెలవారు చుండెను. ఎక్కడ చూచినను మంగళవాద్యములు, బ్రాహ్మణోత్తముల వేదఘోష, ప్రతిధ్వనించు చుండెను. రాములకు, సీతకు అభ్యంగన స్నానములు చేయించుటకై సరయూనది పవిత్రజలమును బంగారుబిందెలతోతెచ్చి పరివారము సంసిద్ధముగా యుండిరి. స్వస్తివాచకములు చెవులకు ఇంపుగాచేరజొచ్చెను.

మంథర మనోవేదన :

ఇవియిట్లు జరుగుచుండ ఆనాటి రాత్రకైక పనికత్తె అయిన మంథర తన నివాసమునకు వెళ్ళుచుండ ఈ అలంకారములు, వైభవములు చూచుచు కారణము తెలియక కొంత విచారణను మొదలుపెట్టగనే, రామచంద్రుని పట్టాభిషేకమని తెలియవచ్చెను. తనతోపాటు పనికత్తెలుగా కౌసల్య సుమిత్రల వద్దరుండువారు తెల్లని మల్లె పూలవంటి చీరలుకట్టి అనేక ఆభరణములుధరించి అటూ

ఇటూ తిరుగుచుండుటకూడ కంటికి కనిపించెను.

ఇక తాను అక్కడ నిలువలేక పోయినది. తన ఒంటిపై జెఱ్ఱెలు ప్రాకినట్లయినది. తేళ్లు కుట్టినటుల బాధ పడినది. నేరుగా కైకమందిరమునకు పరుగెత్తుకొనివచ్చి కైకేయీదేవి మందిరమునకు హుటాహుటిని పోయినది. అప్పటికే కైకేయి తన శయ్యామందిరమునకు వెళ్ళియుం డుటచూచి తలుపుచెంతకువెళ్ళి తీక్షణస్వరముతో అమ్మా! అమ్మా! తలుపు తెరువుము, తలుపు తెరువుము. అత్యంత అవసరమైన విషయము. నీజీవితమే నాశనమగుచున్నది. భూకంపము చెలరేగినది అని మాటపై మాట వ్యవధి లేక పలుకుచున్న మందర స్వరమును విని,

తక్షణమే కైకేయి తలుపు తీసి యేమిటా తొందర, యేమి కూలి పోయినది, యెందుకింత విచారముగా నున్నా వని చులకనగా అడిగెను. అంత మందర కూలిపోయి నదా? నాదేమీ కూలిపోలేదు. కాలిపోలేదు. నీజీవితమే కూలిపోవుచున్నది, వెట్టిరాణివై జీవించవలసివచ్చుచున్నది. అని అనేకరకముల ఆరాటము చేయుచు కంటిధారలు కార్చుచు విలపించెను.

కైకేయికి ఏమియు తెలియలేదు. మహారాజు, రామ లక్ష్మణ కౌసల్యాసుమిత్రాదులు క్షేమమే కదా? వారలు క్షేమముగానుండిన ఇకయేమైననేమి? నాకెట్టి విచారము లేదు. వారలకేమైనా ప్రమాదములు వాటిల్లినవా మందరా

త్వరగా తెలుపుమని తల పట్టుకొని గడ్డముపట్టి బ్రతి మాలును. అంత మందర వారలకెట్టికీడును లేదు. నీ కొమరుని గొంతుకోయ సంకల్పించినారు. అని బోరున ఏడ్చును.

అందులకు కైక మందరా నీవు పొరపడుచున్నావు. మహారాజు కాని రామలక్ష్మణులు కాని నాఅక్కలైన కౌసల్యా సుమిత్రాదులు కాని అట్టివారుకారు. నా కుమారుని తన కుమారులకంటె అధికంగా ప్రేమింతురు. ఇది నీబుద్ధి దోషముతప్ప సత్యముకాదు. ఇంతకూ విషయమేమిటియో వివరించుమని అడిగెను.

సనికత్తె పన్నాగము:

విషయమా, రేపటి తెల్లవారి సూర్యోదయ సమయమునకు శ్రీరామచంద్రుని పట్టాభిషేకమట. పట్టపురాణిని పట్టపగ్గములేక, అత్యంత ఆనందముతో తమ దాసీలకు పట్టుపీతాంబరములు, ఆభరణములు పంచిపెట్టుచున్నది. రామునిచేత గోవులను. సువర్ణములను, దానముచేయించుచున్నది. ఇన్ని జరుపుకొంటు నిన్నిట్లు అలక్ష్యముగా విడిచిపెట్టుట నేను భరించలేను. సహించలేను. నీవు యింకా తెలిసికొనలేక పోవుచున్నావు. భర్తకు అయిష్టురాలవయి పోయితివి. నాయంతటి భాగ్యవంతురాలు లేదని నీవు విఱ్ఱవీగుచున్నావు, కానీ,

నిజముగా నీయంతటి దురదృష్టవంతురాలు లేదని

చెప్పవచ్చు. నీభాగ్యము యెండకాలపు నీటినీళ్ళవలె అడుగంటిపోవుచున్నది. నీవు పతీ సవతులకు పనికిరాని దానవయి పోయితివి. ఇంకకొంతకాలములోనే, నిన్ను ఒక దాసివలె వినియోగించు కొందురు. అట్టి దుస్థితిరాక మునుపే కొంతజాగ్రత్త పడుట మంచిది. నిద్రనుండిలేచి, నిండుహృదయముతో విచారించుము. నీకురాబోవు దుర్గతిని తప్పించుకొను ఉపాయమును ఆలోచించు కొనుము.

దుష్ట మతులు:

రాముడే యువరాజైన ఇక రాజ్యమంతయు కౌసల్యా హస్తమున నిలువగలదు. అందరితోపాటు నీవును ఆమె హస్తగతమై ఆమె ఆడించునటులాడవలసివచ్చును. అని దొంగఏడ్పులుప్రదర్శించి మహాఉపకారివలె నటించుచున్న మందరనుచూచి,

కైక, మందరా! నీకేమయినా మతిచెడినదా? రామచంద్రుడు యువరాజు కావటము రాజ్యమునకే మంగళము ఇట్టి ఆనందవార్తనందించినందుకు యిదిగో నాకంఠహారమును నీకు బహూకరింతును. సంతసింపుము. రామచంద్రుడు రాజుగాకుటం తన తల్లియైన కౌసల్యకంటెను నాకె అమితమైన ఆనందము. రామచంద్రుడు కూడను తన తల్లికింటె నన్నే అమితముగా ప్రేమించును. గౌరవించును. అట్టి మహా గుణశాలిపై నీవిట్టి అపవాదులు కల్పించుట నెవినజాలను. నీకు మతిచెడినట్లున్నది. అని

మందరను కెక మంపలించెను.

మందర మరింత ఆర్భాటము చేయుచు, రాణీ! నాకు కాదు మతిచెడుట నీకె. రాబోవు ఆపత్తులను, యోచించతున్నావు. గ్రుడ్డినమ్మకముతో ప్రవర్తించుచు న్నావు. నేను నీ క్షేమ గౌరవములను కోరియే యింత బాధ పడవలసి వచ్చెను. వారందరు వట్టి నాటకములాడు చున్నారు. నీవన్న యేమాత్రము గౌరవములేదు. మహా రాజునకు పట్టపురాణిపైతప్ప అన్యరాణులపై అంతప్రేమ లేదు. సమయస్ఫూర్తిగా నిన్ను తృప్తిపరచుటకై ఇచ్ఛకపు మాటలాడుచున్నారేకాని నిజముగా నీపైప్రేమలేదు.

నిజముగా నీవన్న వారలకు గౌరవప్రేమలేయుండిన రామ పట్టాభిషేకవిషయమును నీకేమాత్రమైనా యెన్నడైనా తెలిపిరా? ఎన్ని నెలలనుండియో ఈ ప్లాను వేసికొని యుండుటచేతనే ఈనాడది ఈరూపమునకు రాగలిగినది. లేకున్న పట్టాభిషేకము అప్పటికప్పుడుట్టి పడునదికాదు కదా! ఇదంతా కౌసల్యాదేవి పన్నిన పన్నాగము.

"ఛీ! మందరా! అక్కగారికట్టి తలంపేనాడునూరాదు. లేదు, నేను నమ్మను. మహారాజుగారు అంతకంటె మంచి వారు. వారిలో ఇట్టి కుచ్ఛితపుబుద్ధులు మచ్చుకైననుకని పించవు. ఏదోకారణములు లేక అప్పటికప్పుడు ఈ కార్యమును నిర్ణయము చేసియుండరు. రామ కల్యా ణమెన్ని నెలల ప్రయత్నము. అప్పటికప్పుడే నిర్ణయ

మయినటులనే రామపట్టాభిషేకము కూడ నిర్ణయమయి యుండును. దీనికి కారణము మహారాజుగారే తెలుపు దురు. నీవు విషయమును తెలిసికొనక వికారభావము లతో పవిత్ర హృదయములను శంకించుచున్నావు. కొన్ని నిమిషములలో విషయముతెలియగలదు. '' అని మంధరను మందలించుటచూచి,

మంధర తన పన్నాగము పూర్తిగా విఫలమగునేమో అని భయపడి శృతిమించు స్థితికి దిగి తల్లీ! నీవు లోతుగా యోచించు. నేను బైటనుండి అనేక విషయ ములు విన్నాను. అసలు ఈపట్టాభిషేకము కొన్నినెల లకు పూర్వమే నిర్ణయించు కొన్నారు. అందుకనే భరత శత్రుఘ్నులను బైటకు పంపినారు. వారుండిన కొన్ని యిబ్బందులు కలుగునేమో యని భయము.

వివాహ సమయమున వాగ్దానము :

దానికనేక ఆధారములుకూడనులేకపోలేదు. కాకున్న భరత శత్రుఘ్నులులేని సమయమున ఈపట్టాభిషేకమేమిటి? ఇంతమాత్రమైనా నీవు యోచించుకొన లేక పోతివా ? పూర్వము నిన్ను వివాహమాడు సమయమున నీకు జన్మిం చిన పుత్రునికే పట్టాభిషేకమును చేతునన్న దశరథుని వాగ్దానమును ? మరచినను నేను మరువను.

భరతుడు ఇప్పటిలో యిక్కడున్న దానివిషయము

కొంత విచారణలోకి వచ్చునేమోయన్న భయముతో భరతుని తాతగారి దగ్గరకు పంపటమైనది. పట్టాభిషేకము జరిగిన తరువాత యెవ్వరు యేమి చేయలేరుకదా!

ఈ యుక్తితో యింత గుట్టుగాబెట్టి నీకు సహితము తెలుపక చేయుటలోనున్న అంతరార్థమేమిటియో నీవుయో యోచించుకొన లేక పోవు చున్నావు. తెల్లనివన్నియు పాలే అన్న స్థితిలోనున్నావు. ఇంత అవి వేకురాలవగు చున్నావు.

రాముడు రాముడు అని రమించుచున్నావు. పోనీ అంత ప్రీతిగా నున్నరాముడైనను నీకు తెలిపెనా ?

( సశేషము )

బ్రతుకునందు లేదు బండారము, భావమునందే యున్నది భాగ్యరాశి. భగవత్ భావములు కలిగెనా, అట్టివాడు చచ్చినను బ్రతికిన వాడే. అట్లుకాక విషయాసక్తుడై నిరంతరము పవిత్రకాయమును అపవిత్ర కర్మలయందు అంకితముచేసి క్షణిక సుఖమునకై సర్వజ్ఞత్వము సర్వశక్తిత్వ మౌనగు సర్వేశ్వరుని మరచుట మానవత్వమునకే అపకారము కాగలదు.

(బాబా)

# కరుణా పరమావధి

—○○—

శ్రీమహాలక్ష్మియై శ్రితదీనజనకోటి
సంతాపములబాపు సాయిమాత
శ్రీసరస్వతియై ముపాసక వర్గిజ్ఞాన
సంపదల్ సమకూర్చుసాయిమాత
శ్రీగౌరియై ప్రేమసింధువై సర్వులన్
జల్లంగా రక్షించు సాయిమాత
శ్రీమహాలక్ష్మియై చెనటి దుశ్చింతలన్
సంహారమొనరించు సాయిమాత
రాజరాజేశ్వరియు నౌచుం దేజరిలుచు
సకల జగముల శాసించు సాయిమాత
అల్ల లలితా పరాశక్తియైన తల్లి
సన్నుతింతును శ్రీసత్యసాయిమాత

వెలుగు, వేడియు, జీవ, మిలకెల్లనిడు జగ
చ్చక్షువీ శ్రీసత్యసాయిబాబ
ధరణి ధర్మాధర్మ సరణిం దెల్పెడి శాస్త్ర
చక్షువీ శ్రీసత్యసాయిబాబ
భ్రమబాపి నిత్యసత్యమును జూపెడి జ్ఞాన
చక్షువీ శ్రీసత్యసాయిబాబ
తనకుం దన్నెఱింగించి తనియించు నాంతర
చక్షువీ శ్రీసత్యసాయిబాబ
అట్టి పరమాత్మయే నేతయయ్యె మనకు

మతులు పెడదారిబడిన విస్మృతియెలేదు
కాయికాంధులు మనకన్న వేయిరెట్లు
మేలుకారొకో కన్విప్ప మేవి మనము.

తీరికకైన, నీదయన తీరమికిన్. మము జేర్చుకొంటకున్ జేరపకుంటకున్' విముఖజించినఁ గోర్కెలు తీర్చుచుంటకున్ దీరపకుంటకున్, నరుల తెల్వుల కందెడి కారణాలు దై వారవు. సత్యసాయి భగవన్ ! భవదీయ విచిత్రవర్తనన్

తప్పుగావింప దండించు తండ్రియౌచు
దైవ్యముంగాంచి లాలించు తల్లియౌచు
మాతృభూతేశ్వరాకృతిన్ మమ్ముసాకు
స్వామి శివసాయి చరణముల్ శరణుమాకు.

సర్వమంగళరూపిణి సాయిమాత
జగదనుగ్రహకారిణి సాయిమాత
సకల కారణ కారిణి సాయిమాత
జనని శివసాయి చరణముల్ శరణుమాకు.

పరమాత్మకు విష్కారణ
కరుణా పరమావధికి నఖండ ప్రకృతి
స్ఫురిత నిజదివ్యమూర్తికిఁ
జరుగుత జయ మంగళంబు పరీక్షకునకున్...

రామశర్మ.

# దివ్య జ్ఞాన చక్షువు

నిర్గుణ నిరాకారమును చూచితిమని ఉపనిషత్ వేత్తలు చెప్పుచున్నారు. వారు చర్మ చక్షువులతో చూచినదిగాదు. అది జ్ఞాన చక్షు దర్శనము. కన్నులుండియు దానిని మనము చూడలేము. చూచితిమని చెప్పుకొన్నను అది మనలను మనము మోసపుచ్చుకొనుటయే! భ్రాంతియే!

శ్రీబాబావారి చక్షువులు వేరు. అవి గతాగతములనేగాక వాటిని దాటిన విషయములనుకూడ చూడగలవు. అవి ఒకసారి కఠినముగాను మరొకసారి ప్రేమపూరితముగాను ఉండును. అవి మన హృదయములలోనికి చొచ్చుకొని పోవును. అంతేకాదు. హృదయస్థాయిని అధిగమించి చన గలవు అప్పుడప్పుడు అవి అగ్నిజ్వాలలవలె ప్రజ్వరిల్లి పతితులను సైతము పవిత్రము చేయును. స్వాతి వానకు ముచ్చెపుచిప్పలు ఎదురు చూచినట్లు భక్తులు వారి ప్రేమ పూరిత శీతలదృష్టికొరకు ఆకాంక్షించుచు నిరీక్షించు చుందురు.

వారి నేత్రములు వారిదృష్టి సర్వత్రావ్యాపించును. అందరినీ వెంటాడును. నూతన సంవత్సరాదినాడు నేను హఠాత్తుగా పడిపోయితిని. నా భుజము విరిగినది. జనవరి నాలుగవ తేదీని నేను బాబావారిని కలిసితిని. జరిగినదంతయు ప్రేమతో నాకు తెలిపిరి. ఇది యంతయు బాబావారికి యేల్లాగున తెలిసినది?

వారు ఎట్లు చెప్ప గలిగిరి. వారి కనులు నన్ను చూడగలిగినవి. నన్ను రక్షించినవి. వారి కన్నులనుండి వెలువడిన జ్వాలలు మనలను పవిత్రులను చేసి సదా రక్షించు చుండును. అవి మనలను వారిని చేరేదాకా వెంటాడుచునే యుండును. మనము పతితులమైనచో వారి కనులలోనికి సూటిగా చూడలేము. వారి ఎదుట నిలబడలేముకూడ. వారి ప్రేమ సర్వులను జయించును. బాబావారు ప్రేమావతారులు. వారి ప్రేమ దృక్కులలో మనలను ఇముడ్చుకొని బుజ్జగించుదురు. దైవమే ప్రేమయని చాటుదురు. భవబంధ బద్ధులారా! రండి. వారి దయకు పాత్రులుకండి. బంధవిముక్తులుకండి. అఖండ శాంతిని అనుభవించండి.

దయానంద.

## క్రమ శిక్షణ

క్రమ శిక్షణ అను పదమునకు, పరిపరి సన్నివేశములలో పరిపరి విధములైన అర్థములు వాడుకయందున్నవి. ఆరోగ్య పోషణకొరకు, దేహదార్ఢ్యముకొరకు శ్రమకోర్చి కష్టపడి విద్యార్థులు యెక్సర్‌సైజుల ననుసరింతురు. ఇంద్రియములను స్వాధీనము నందుంచుకొనుటకు కొందరు సన్యాసులు, సాధువులు, శీతలజల ప్రవాహమందు కంఠము వరకు నిలబడి జప, తపాదులను చేయు చున్నారు. పిల్లలకు వినయ విచక్షణలు నేర్పుటకై తల్లులు

వారిని కొట్టి మందలింతురు. యుద్ధభూమిలో సిపాయిలు దండనాయకుల ఆజ్ఞా పాలనము, మారుమాటాడక, వెనుకంజవేయక, మృత్యుముఖమున పడుటకుకూడ సిద్ధమగు రీతి సైన్య శిక్షణము నవలంబించి యున్నారు. వీటన్నింటికీ క్రమశిక్షణ అనే పేరు. ఇవన్నీ క్రమశిక్షణయొక్క వివిధ రూపములు, నిదర్శనములు.

అయితే, ఆ శిక్షణయొక్క మూలాధారమేమి? ముఖ్యోద్దేశమేమి? దానివలన ప్రాప్తమయ్యే లాభమేమి? విజ్ఞానమా? చదువు సంస్కారమా? గుణపోషణమా? తన్నుతాను నమ్ముటయా? ఒకరినొకరు అర్థము చేసికొనుటయా? మంచినడకయా? అనుభవసిద్ధమైన వివేకమా? దాని గమ్యమేమి? ఇట్టి ప్రశ్నలను వేసికొని విచారణ సలిపిన, దాని గమ్యము ప్రేమయే యని తేటతెల్లమగును.

ప్రేమలో జన్మించి ప్రేమతోనే క్రమశిక్షణలో పెరుగును. అన్నిటికీ ముందు, తన్నుతాను ప్రేమించవలెను. తన జీవితమును సార్థకము చేసికొనవలెననే ఉత్సాహమత్యవసరము. తాను ధర్మమార్గమున కర్మలనాచరించి జన్మరాహిత్యమునుపొంది ధన్యుడు కావలెను. ఆదర్శమార్గము ననుసరింప వలెను. ఇట్టి అనుభూతుల పరిజ్ఞానముల నందించని చదువులు కేవలము వృథా! దీనికి మహానుభావులయొక్క జీవితగాథలే మనకు నిదర్శనములు. క్రమశిక్షణలద్వారా, శీలము వెలగొల్పేకొరకు సాత్త్వికగుణముల నభివృద్ధి చేసేందుకు, వాటిలో మంచి బుజువులు దొరకును. ధర్మమంటే యేమిటి? ధర్మాచరణకు కావలసిన నియమనిష్ఠలేవి?

శ్రీరామ చంద్రుని చరిత్ర చదివితే తెలియును. విషయ విచారణ ద్వారా విచక్షణను సంపాదించేది క్రమశిక్షణయొక్క లక్షణము.

ఈరోజున మనము చాల ధన్యులము, మనతో కలిసి మెలసి మనకన్నులయందు తిరుగుచు మనకు బోధనలు చేయుచు మనలను చక్కదిద్దుచున్న స్వామి మనకు లభ్యమైయున్నారు. క్రమశిక్షణలకు స్వామియే మనకు మార్గదర్శి. అన్నియుచేసి చూపి నడిపించు మార్గదర్శకులు స్వామి.

స్వామిచేసే ప్రతిపనియందు స్వామియొక్క ప్రతిచర్యయందు వారి దివ్యోపన్యాసములందు క్రమశిక్షణ యిమిడియున్నది. క్రమశిక్షణయొక్క ముఖ్యోద్దేశము ప్రేమయే. ప్రేమే దైవము స్వామి ప్రేమ జ్యోతి. స్వామి తత్త్వమంతయు ప్రేమమయమే. అదియే క్రమశిక్షణయొక్క గమ్యము.

క్రమశిక్షణను పాటించిన యశస్సు దొరకును. ధనార్జన సాధ్యమగును. భద్రత చేకూరును అని చెప్పుదురు. వ్రాయుదురు. అయితే, యివన్నీ అంత ప్రధానములు కావు. ప్రపంచములోని క్షణికకీర్తిగాని ఇతరులపై అశాశ్వతమైన అధికారము కాని ఉత్తమ క్రమశిక్షణయొక్క గురికాదు. అఖండ శాంతి నందుకొనుటే క్రమశిక్షణయొక్క గురి. ప్రేమ వలననే సమాజమున శాంతి స్థిరమగును.

క్రమశిక్షణ చర్యలను మన దైనందిన జీవితములో ఎంత

వరకు అదరించుచున్నాము. అవి మనము ప్రతిపనిలోను పరీక్షించి తెలిసికోవలెను. ఉదాహరణకు తీవ్రముగా కోపోద్రేకములతో మాట్లాడు స్వభావము మనకు గలదని అనుకుందాం. దాని పరిహారముకొరకు నాలుకను కోసికొంటామా? లేదు. ఇతరులతో మాట్లాడుట మానివేస్తాము. ఎందుకనగా ప్రేమ ఆ విధముగా ఆదేశించును. ఆ ఉపదేశము ననుసరించి నాలుకకు శిక్షణనిచ్చుచున్నాము. అంతే అట్లు చేయుటకు మనోబలము లేని యెడల దానిని ప్రసాదించ వలసినదిగా స్వామిని ప్రార్థించండి. "స్వామీ! ఈ కోపము నా స్వభావముకాదు. అది యెట్లనో నా మనసును ఆవరించినది. దానిని పోగొట్టి నన్ను కాపాడుము." అని వేడుకొన వలెను. వారు కాక మనకు మనోబలము నిచ్చువారెవరు?

స్వామియే మనకందరికీ అండ, దండ. మన నమ్మకము వంచున్న సర్వేశ్వరుడు స్వామి. వారి దర్శన, స్పర్శన సంభాషణలు మనకు యెల్లప్పుడు లభించును. మనలను చక్కని క్రమశిక్షణలో నడిపించవలసినదిగా అండదండగా యుండవలసినదిగా ప్రార్థించుదము. స్వామి ప్రేమ మయుడు. ఆవేదనతో పిలిచిన మన మెచ్చుటమందినను యేవేళయందైనను పలుకుదురు వారు మన హృదయ నివాసి, ఆత్మస్వరూపులు.

క్రమశిక్షణయొక్క ముఖ్యోద్దేశము ప్రేమ సాధన, శాంతి సంపాదన, దానిగమ్యము ఆనందము. వ్యక్తియొక్క ఆనందము సమాజముయొక్క శాంతి, నిశ్చల బుద్ధితో దృఢవిశ్వాసముతో.. భగవత్

చింతనతో సాధించే కొరకు. స్వామిని నిరంతరము ప్రార్థించండి. వారు మనకు శ్రద్ధాభక్తుల నొసంగుదురు.

అనంతపురం. శ్రీసత్యసాయి మహిళా కళాశాల 5-1-72

జాన్ హిస్లాప్ గారి ఉపన్యాసములోని అంశములు.

# భగవదర్పితము

జ్ఞానములేకపోతే శూన్యము. పురుషార్థము యేమీలేదు. సత్కర్మలను సాధన చేసినప్పుడే ఆనందమును అందుకోగలము. ఎంతకాలము బ్రతికినను. కాకి హంస కానేరదు. నీరుకలిపిన పాలలోనుండి పాలను వేరుచేసి హంస త్రాగును. ఆరీతిగనే ఆత్మను అనాత్మనుండి వేరుచేయువాడు పరమహంస మహాత్ములు పరమహంసలు, అంటే విభాగయోగమును సాధించినవారు. పవిత్రమైన పదార్థమును అందుకొనే అవకాశముకోసమై ప్రయత్నము చేయాలి.

దీనికి తగిన సాధన యేది అని ప్రశ్నించిన తరుణోపాయము. భగవన్నామస్మరణమే కలియుగంలో ముఖ్య

మైన సాధన. అప్పి రసములు దీనిలోనే దొరకును. అది భక్తి భాండాగారము. అట్టి పవిత్రమైన భక్తిని ఆరగించినపుడు సంపూర్ణానందము కలుగును. కొమ్మకొమ్మకు, రెమ్మరెమ్మకు నీరుపోయరు. వేరుకు నీరుపోస్తే తక్కినవన్నియు అభివృద్ధి యగును. ఆధారము యెప్పుడు గోచరముకాదు. ఆధేయమే గోచరమగును. అయినప్పటికి కనుపించని పరమాత్మతత్త్వమును కొంత ప్రయత్న సాధనతో మనము సాక్షాత్కరించుకోవలెను.

సంసారము చిక్కులతో నిండియుండును. కాబట్టి, సాక్షాత్కారమును అందుకొనే అవకాశమున్నదా అనే సందేహము కొందరికి రావచ్చును. సందేహించడము పొరపాటు. రోగులకే వైద్యము హస్పిటల్ మందు అంతా అవసరము. రోగంలేనివానికి వైద్యునితో పనిలేదు. మనము మిథ్యలోను న్నాము, సత్యమును, మిధ్యను రెంటినీ చూడవలెను. నిరంతరము ఉండి మార్పుచెందని పరతత్త్వమున్న సత్యమనిన్నీ, కనుపించికను పించనిది మిథ్య యనిన్నీ అంటారు. ఒక్క సమయములో గోచరమై మరొక్క సమయములో అగోచరముగా నుండేది మిథ్య. అందుకే అది "సదసత్" అనే సార్థకనామము వహించినది.

భగవద్విషయములో ఏమాత్రము సందేహమునకు చోటి వ్వక ఎన్ని నిందలు దూషణలు వచ్చినను దాన్నిపెట్టుకొని సరి యైన విశ్వాసముతో ఆ భగవంతుని అనుగ్రహమును అందుకొనే ప్రయత్నము చేయాలి. ఎట్టి మహనీయుడుకూడ యిటువంటి బాధలకు గురికాక అభివృద్ధికి రాలేదు. మంచి చెఱకును నమలి

పిప్పిని తీసి రసమును గ్రోలాలి. మంచిజాతి వజ్రమును సాన బట్టి తీర్చిదిద్దాలి. అప్పుడే ప్రకాశవంతముగా నుంటుంది.

ప్రతిమానవుని కష్టనష్టదుఃఖములతో తీర్చిదిద్దాలి. ధైర్యసాహసములతో దేనికిజంకక క్రుంగక భగవంతుని అనుగ్రహమునకు పాత్రుడు కావాలి. ప్రతి విషయములోను వచ్చిన కష్టనష్టములను భగవంతునికి అంకితము చేయాలి. దేహము నిమిత్తమాత్రమని భావించి నిత్యస్వరూపుడైన పరమాత్మని సందర్శించుకోవాలి. లక్ష్యమువదలక ప్రయత్నము చేయాలి.

అన్నింటికన్నను చాల సులభమైన మార్గము నామసంకీర్తనము. సర్వదా హరి కీర్తనమును ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా మన హృదయమున చేసికొన్నచో, పవిత్రమైన జ్ఞానాగ్నిని సకాలములో అందుకోగలము. దుఃఖము వచ్చినను సుఖము వచ్చినను భగవంతుని అనుగ్రహమని భావించాలి. మంచికి పొంగక, చెడ్డకు క్రుంగక సత్యాన్ని పెంచుకొని సమాధిస్థితిలో ఉండి స్థిత ప్రజ్ఞుడుగా మెలగాలి. మంచి కర్మకు చెడ్డ కర్మకు భగవంతుడే ఆధారము. నిత్తనమే మొక్కకు పూర్వరూపము. ప్లేన్ తిరగటములో పైలట్ లేకపోతే కొన్ని యంత్రములు కంట్రోల్‌కు రావు. దానిని నడిపించే పైలెట్‌ను యిక్కడనుండిచూస్తే కనిపించడు. కాని, ఏరోప్లేను లో మనం చేరినపుడు గోచరుడగును. అదే రీతిగా ప్రకృతికూడ తిరుగుతుంది. దానిని నడిపించే భగవంతుడే దాని పైలట్ ఆ స్థానమును చేరుకొన్నపుడె అతడుగోచరుడగును. విచారణ సల్పక విషయముపై

విమర్శన. చేసినపుడు సత్యముగోచరము కానేరదు.

ప్రతి విషయమును కొంత ఓపికతో విచారణ సలుపుటకు పూనుకోవాలి. అపుడే దాని భావము గోచరమగును. ఎక్కడ చూచినను భగవంతుడున్నాడన్నను అట్లుండినను ఎందుకు గోచరించడన్నను దానికి కొంత ప్రయత్నము కావాలి. ఒకచిన్న మాటకుగాని, ఆటకుగాని, పాటకుగాని అభ్యాసము అవసరము. పరమాత్ముడు ఎక్కడ? ఎక్కడ? అన్నంత మాత్రమున గోచరము కాడు. కొంత పటుత్వముతో బలవత్తరమైన మహా శక్తి యుందని విశ్వసించి ఆ శక్తిపై నాధారపడి శరణాగతి మనోభావమును పెంచుకోవలెను ధర్మకర్మలను మానుకొనేది శరణాగతి కానేరదు.

సర్వకర్మలచే :- భగవత్ప్రీత్యర్థం అని ఫలముపై అపేక్ష లేకుండ సర్వము భగవంతునికి అర్పించవలెను అదియే శరణాగతి. కర్మాచరణ ఫలాపేక్షతో చేసి నిరాశకు గురియై అవిశ్వాసమునకు చోటిచ్చిన, కట్టకడపటికి జీవితమే వ్యర్థమగును. ఉన్నదాన్ని లేదనే వాదనలో మనబుద్ధి వికాసము అంధకారములో పడి వివాదమునకు పూనుకొంటుంది. ఇపుడు మన దేశములో రాత్రిగా నుంటున్నది, నక్షత్రములు కనుపిస్తున్నాయి కాని అమెరికాలో ఈ సమయములో మంచి సూర్యప్రకాశముండే మధ్యాహ్నముగా నుంటుంది. కాబట్టి మనం వాళ్ళను ఫోన్‌లో పిలిచి వాదము చేస్తామనుకోండి. ఇక్కడ మాకు నక్షత్రములు కనుపిస్తున్నాయే మీకు యెందుకు కనుపించవు? అంటే ఇక్క-

నను అక్కడకు కాలములో మార్పు ఉండటము వలన మనకు కనుపిస్తున్నాయి వారికి కనుపించుట లేదు. ఆదేరీతిగా కొంత అపరిశుద్ధమైన కర్మమేఘములు దట్టముగా అడ్డముండుట వలన భగవచ్ఛక్తి అనే కోటిసూర్యప్రకాశము కొందరికి కనిపించకపోవచ్చును. మనము నిర్మల, నిశ్చల, నిస్వార్థ సన్నిహితులము కాలేనపుడు కోటి నక్షత్రములున్నను మిణుకుమిణుకుమనే ప్రకాశమే కనుపించును.

వారివారి పక్వస్థితిని బట్టి అర్హులౌతారు. నాకు అర్హతలేదే అని వాదించి ప్రయోజనము లేదు. బజారులోపల ఒక కిళ్ళీ కొట్టువాడు ఇంకొకనితో జగడమాడి ఒకచిన్న కత్తితో వాని పొట్టను పొడిచినాడంటే పోలీసులు తీసికొనిపోయి విచారణచేసి శిక్షిస్తారు. కాని అదే ఒక డాక్టరు పేషంటు వ్యాధినిమిత్తము పొట్టకోయుటకు పోయెదనని స్లైకగా చెప్పి హాస్పటల్‌లో బంధువుల దగ్గర వాని ఆపరేషనుకు ఒప్పుకున్నామని వ్రాయించుకొని పొట్ట కోస్తాడు. ఆ పనిచేయుటకు ఆయనకు అధికారశక్తి కల్గియున్నాడు. కాబట్టి కొంతవరకు పరాజయమును పొందినప్పటికి ఆయనను శిక్షించుటలేదు. అదిలేనివాడు కత్తితో అధికార విరుద్ధమైన పనిని చేయుటవలన శిక్షకు పాత్రుడౌతాడు.

ఇద్దరు చేసినపని ఒకటే అయినప్పటికిని అధికారములో వ్యత్యాస మున్నది.

భగవదనుగ్రహమునకు ఏరీతిగా పాటుపడవలెనంటే ఏకర్మ చేసినను భగవంతునికి ప్రీతికరముగా చేయ్యాలి. నాప్రేమ, నా

భక్తి అని నీవు కొలత వేయడములో లాభములేదు. నీ భక్తిని, ప్రేమను భగవంతుడు అనుమతించాలి. అప్పుడే సార్థకము, కాని లేకపోతే అది ప్రయోజనము లేదు. ఏదైనా రిజిష్టరు లెటరు పోష్టుద్వారా పంపినపుడు తిరుగు రసీదు మనకు వస్తేనే ఆ లెటరు ఆతనికి చేరినట్లు గుర్తు. అనేక విధములైన సాధనలు చేసినను భగవత్ కటాక్షమునకు పాత్రుడైన సూచనయే, లేకపోతే వాడు భక్తుడు కానేరడు.

నాలో భక్తి యున్నదని బోర్డు వేసికొని చెప్పినను ఎవ్వరును దానిని నమ్మరు. భగవంతునికి యేమిచేస్తే యిష్టమో దానిని పూనుకోవాలి. అప్పుడే అవనిలోని లోపములనుకూడ లెక్క చేయక అనుగ్రహిస్తాడు. మన యింటికి వచ్చిన బంధువులు మన యింటిలోనే పని చేస్తుంటారు. కాని సాయంకాలమైనది, మేము చేసిన పనికి కూలి ఈయమని అడుగుతారా ? అడుగరు. కూలి అడిగేవారు పరాయివారు. యజమానియొక్క స్వంతమనిషిగా ఉన్నపుడు కూలి అడుగరు. నాకు తత్ఫలం యివ్వమని కోరినవాడు పరాయివాడు, దగ్గరవాడు కాడు. దేవుడా నాకార్యము సిద్ధించినదంటే నీకు 108 టెంకాయలు కొడతాను అంటే ఆ దేవునికి 108 టెంకాయ్. దొరకని దురవస్థ కలిగితే ఆదేవుడు కార్యమెట్లు ఫలింప చేస్తాడు ?

భగవంతుడు సర్వశక్తిమయుడు. ఎవ్వరి దగ్గర చెయ్యి చాపడు. నీ విచ్చేదానికోసమని యెదురుచూడడు. నీ విచ్చేదేమీ లేదు. ఏమంతా నీదగ్గర ఉన్నదో అదంతా అతడిచ్చినదే.

ఒకడు వస్తాడు నేను రామచంద్రునకు మందిరము కట్ట బోవు చున్నానని దానికి 10రూపాయలు చందావేయ మంటాడు. ఆ శ్రీరామునికి ఆ పది రూపాయిలు లేకనా ?

భగవంతునికి మందిరము కాని కోవెలకాని ఇంకే విధ మైన ఆడంబరములు కాని అవసరములేదు. మీ హృదయమునే మందిరముగా చేసికోండి. భక్తుని ఆనందమే భగవంతుని ఆహా రము. నిర్మల హృదయమే భగవంతుని మందిరము. నిర్మల ప్రేమయె భగవంతునికితృప్తి. చెయ్యిచాపినవాడు బిచ్చగాడు ఇచ్చేవాడు సర్వాధికారి. అయితే భగవంతుడుకూడచెయ్యిచాపుతాడు. దేనికోసము. తను యిచ్చిన హృదయపాత్రను చిత్తశుద్ధి అనే. శుభ్రత చేసిపెట్టుకొన్నపుడు దానికోసమని, అనగా తాను యిచ్చిన పాత్రకోసమని చెయ్యిచాపుతాడు. తెచ్చేటప్పుడు తెచ్చుకొనివాడు కాని వాపసు యిచ్చేటప్పుడు గలీజుగా యివ్వకూడదు. పెళ్ళిళ్ళకు పాత్రలు తెస్తాము. పరిశుద్ధము చేసి యివ్వడము మన కర్తవ్యము ఈనాడు యేరీతిగా నిర్మల నిశ్చల నిస్వార్థమైన పాత్రను తెచ్చు కుంటున్నామో ప్రపంచకళ్యాణానికి. తిరిగి వాపసు యిచ్చేటపుడు పరిశుద్ధము చేసియివ్వాలి, లేక ఏది వందుటామో ఆ విషయ వాసన గలీజులో వ్యాపిస్తే తిరిగి యింకొకసారి అడిగితే యివ్వరు. అంతమాత్రమేగాక సరియైన మర్యాద తెలియనివాడను కొంటారు. భగవంతుని సంతృప్తి పరచే కర్మమే కర్మకాని మన అభీష్టం కోసం చేసికొనేది యేదిన్నీ ప్రయోజనం లేనిదే.

(శ్రీవారి దివ్యబోధ)

# బృందావన్ లో శివరాత్రి

---*---

మహా శివరాత్రి ఉత్సవం 13-2-72 వతేదీన బృందావనములో జరిగినది. ఈయేడు శివరాత్రి ఉత్సవం ప్రశాంతినిలయములో జరుగదని ప్రకటించినప్పటికీ స్వామి యెక్కడ ఉండేది సూచన ప్రాయముగానయినా తెలియనప్పటికి 5000 మందికి పైగా భక్తులు బృందావన్ లో సమావేశమై స్వామిని దర్శించు కున్నారు.

ఉదయము 8గం॥మండి అఖండనామ సంకీర్తన ప్రారంభమయినది. భజన జరుగుచుండగా స్వామి స్వయముగా భక్తులకు ప్రసాదము పంచిపెట్టిరి. సాయంత్రము 4-30గం॥లకు ప్రారంభమైన సభలో ప్రసంగిస్తూ డా॥M. B. మంద్రరావుగారు శివరాత్రినాడుచేసే ఉపవాసము జాగరణలయొక్క అంతరార్థములను వివరించిరి. అనాటి సభలో శ్రీసత్యసాయి కళాశాలలో చదువుకొనుచున్న ముగ్గురు విద్యార్థులు ఉపన్యసిస్తారని చెప్పిరి. భగవాన్ ఆదేశానుసారము నెలకొల్పబడిన వినూతన విద్యా విధానము నైతిక ఆధ్యాత్మిక క్రమశిక్షణలపై ఆధారపడి యున్నదని ఉద్ఘాటించిరి. నైతిక విలువ పెంపొందే శిక్షణ పథకమును అమలు జరుపుటకు యూనివర్సిటి గ్రాంట్సు కమీషన్ శ్రీ సత్యసాయి కళాశాలను కేంద్రముగా రూపొందించుటకు నిర్ణయించినదని, దానికి డా॥ వి. కె. గోకాక్‌గారు ఆధ్వర్యము వహిస్తారని చెప్పిరి. యువజనములకు అభ్యుదయదాయకమైన ఇటువంటి

కార్యక్రమమును ఇక్కడ ప్రారంభించుచున్నందుకు హర్షమును వ్యక్తపరచిరి.

విద్యార్థి సతీష్‌చంద్ర (B Com. 2 nd year) ఈ కళాశాల ప్రాశస్త్యమును ప్రశంసిస్తు తనఉపన్యాసములో "ఇక్కడ మేమందరము స్వామియొక్క పర్యవేక్షణక్రింద ఉన్నాము. వారి అనుగ్రహమే మమ్ము నడిపిస్తున్నది. పలుకులు, పనులు, భావములు, హృదయములు ఎప్పుడు పవిత్రముగా ఉండేటట్లు (Watch)జాగ్రత్తపడాలని స్వామి హెచ్చరిస్తుయుంటారు. స్వామి ఆజ్ఞనుపాటిస్తు ప్రవర్తనను సరిదిద్దుకొనే ప్రయత్నముచేస్తుంటాము అందుకనే స్వామియొక్క సాన్నిధ్యమునకు, అనుగ్రహమునకు. పాత్రులమౌతున్నాము, అన్నారు.

తదుపరి రాజన్ పటేల్ అనే మరొక విద్యార్థి(B-Sc. Ist yr.) "ఇక్కడ విద్యాబోధన వ్యాపారదృష్టితో కాకుండ ఆధ్యాత్మిక దృష్టితో జరుపబడుతుంది, ఇక్కడ మాలో ఏరో ధాలు కాని జగడములు కాని లేవు. ధర్మప్రవర్తనకు మార్గదర్శకమైన విద్యావిధానాన్ని పురస్కరించుకొని విధించిన క్రమశిక్షణను పాటిస్తు ఈకళాశాల విద్యార్థులమైనందుకు ఆనందిస్తాము. గర్విస్తాము. మంచినే చేస్తు మంచినే చూస్తు మంచిమంచిగానంటు శ్రీకృష్ణుని చేతిలోని మురళి గొట్టమువలె నిరహంకారులుగా ఉండి స్వామి అనుగ్రహమును సంపాదించాలని మా ఆశయము. మేమెంతో అదృష్టవంతులము. స్వామియొక్క దర్శన స్పర్శన సంభాషణల భాగ్యము మాకు లభించుచున్నది. జీవిత లక్ష్యాన్ని

గురించి స్వామి ప్రబోధిస్తు " త్వరగాబయలుదేరు, నెమ్మదిగావెళ్ళు సురక్షితముగా గమ్యమునచేరు" అంటారు. వారి ఆశీస్సులతో ఎట్టి ఒడుదుడుకులు లేకుండ లక్ష్యాన్ని సాధించగలము. స్వామిని నాతరపున మా విద్యార్థి బృందము తరపున ప్రార్థించేదేమిటంటే " అసతోమా సద్గమయ. తమసోమా జ్యోతిర్గమయ. మృత్యోర్మా అమృతంగమయ " అని అన్నాడు

రాఘవన్ అనే మరో విద్యార్థి (B.Com. 2nd yr) తన ప్రసంగంలో " మానవోద్ధరణకై స్వామి అవతరించారు. నేటి విద్యార్థులే రేపటి నాయకులు. విద్యార్థులను ముఖ్యముగా సంస్కరించు లక్ష్యముతో భగవాన్ యిట్టి ఆదర్శనీయమైన విద్యా సంస్థలను స్థాపించుచున్నారు. ఇటువంటి సదవకాశమును సద్వినియోగము చేసికొని స్వామియొక్క దివ్యమైన అవతారోద్యమమునకు దోహదమిచ్చే సాధనములుగా మేము తయారుకావాలి. పట్నవాసపు అలజడులకు దూరంగా నిర్మలమైన వాతావరణంలో ఈ కళాశాలలను స్థాపించుటచేత విద్యాభ్యాసమునకు నైతిక పురోభివృద్ధికి ఆత్యవసరమైన ప్రశాంతత, ఏకాగ్రత, వీటికితోడు భగవానుని అనుగ్రహము, ఇక్కడ లభిస్తున్నాయి. " అన్నాడు

తదుపరి డా॥ గోకాక్ గారు శివరాత్రియొక్క అంతరార్థాన్ని వివరీకరించారు. పూజలు వ్రతములు మొ॥ కర్మకాండలు సత్ఫలమును అందించాలంటే వాటికి ఆధారభూతములైన సత్యాలతోను దివ్యానుభవములతోను వాటిని నింపాలి. మానవునిలో నున్న వికారా, విస్పృహలను తొలగించి వానిలో నూతనచైత

వ్యమును ఉత్సాహమును నెలకొల్పుటకే బాబావారవతరించిరి. అన్నారు. డా॥ గోకాక్. శివరాత్రిని గురించి వాడుకలోనున్న, యితిహాస గాథల్ని పేర్కొని వాటి సాంకేతిక పరిభాషకు, స్వామి చెప్పిన అంతరార్థము, మనోవిశ్చలతను సాధించడమే అన్నారు. "లౌకిక వాంఛలు అధోముఖంగా దిగలాగుతుంటే పారమార్థిక చింతనలు ఊర్ధ్వముఖంగా యెగలాగుతుంటాయి. ఈరెండు శక్తులకు మధ్యనున్న మానవుడు గాలిలో వ్రేలాడే ఒక జ్యోతిర్లింగము." అని పోల్చారు డా॥గోకాక్. సంపూర్ణ శరణాగతిద్వారానే మానవుడు ఉత్తమ స్థితినధిష్ఠించి భగవంతుని పొందగలడు. విశ్వమును దద్దరిల్లచేసే అనంతశక్తి స్వరూపులై యవతరించిన బాబావారి అనుగ్రహమే మానవాళి అభ్యున్నతికి శరణ్యమని తెలుపుచూ ప్రసంగాన్ని సమాప్తి చేసారు.

తరువాత శ్రీవారు ఇట్లు తమ దివ్యోపన్యాసము నొసంగి అందరినీ ఆనందాబ్ధిలోముంచి అనుగ్రహించిరి.

భారతీయులు అనుష్ఠానప్రియులు; ఆచరణశీలురు, కాబట్టి శివరాత్రి మొదలైన పవిత్రపర్వదినములను వాటిఅంతరార్థమునమసరించి అనుభవించి ఆనందించేందుకు, స్వస్వరూపమును గుర్తించి దానిని సాక్షాత్కరించేందుకు కావలసిన సాధనలకు పూనుకొనేదే పర్వదినముల పరమోద్దేశము: ఆహారవిహారములను ఆరగించే కొరకుకాదు నిజతత్వమును గుర్తించక జీవితమును అంధకారములోనే గడుపుట అజ్ఞానుల రీతియేకానీ వివేక విచక్షణ వైరాగ్యముల గుణములను వరప్రసాదముగా పొందియున్న మానవుల లక్షణముకాదు.

మానవ జీవితములో ఈశ్వరత్వమును ప్రకటించవలెను. మానవ సమాజమునకు ఈశ్వరత్వమే పునాది, ఈశ్వరత్వమే ప్రధానము. అది అహంకార పూరితమైయుండిన వికారమగును: దుఃఖమయమగును.

భారతీయ సంస్కృతియందు కూడ ఇట్టి వికారమూ వికృతి భావములూ, నవనాగరికతయొక్క ప్రభావమువలన, పెరుగుచున్నవి. భగవంతుడు లేడని బల్లగొట్టి చెప్పేవాళ్ళు భారతీయులలోనే యున్నారు. తీర్థయాత్రలు, క్షేత్రదర్శనములు మూర్ఖత్వమని హేళనము చేయువారు మిక్కిలిగా కలరు. అయితే, దివ్యత్వము యెంత లేదన్న పోయేదికాదు। తనకు అయిష్టమనిపించునదంతా వ్యర్థమని చెప్పేదికూడ మూరత్వమే.

ఆధ్యాత్మికము వ్యక్తిగతము కాదు; సమష్టిస్వరూపముగా సాక్షాత్కరించే స్వస్వరూపమే, దాని ఫలితము, ఆధ్యాత్మిక జీవితాన్ని ఒంటరితనముగాకానీ ఏకాకి జీవితముగా కానీ యెంచరాదు మానవిత రాగద్వేషములతో నిమిత్తము లేకుండ, మానవకోటి యావత్తుతో ఏకమై, పరిపూర్ణమై ఉండగలిగినస్థాయి, ఆధ్యాత్మిక స్థాయి।

ఈ సత్యమును గుర్తించుటకు బుద్ధి, ప్రధానమైన ఆధారము బుద్ధిద్వారా స్వరూపమును వెతకవలెను: దానిని గుర్తించి, దివ్యత్వమును తెలిసికొని ఆనందించవలెను.

కానీ, ఇప్పుడు, ఇట్టి మార్గమునకు విరుద్ధముగా ప్రవర్తించి భిన్నమార్గమందు బయలుదేరి, అయోమయ జీవితమునపడి బాధపడు

చురు. తెల్లవారుజామునుండి రాత్రివరకూ బయటనుండి దొరకే సుఖములకొరకే ప్రాకులాడుట అలవాటయినది. బుద్ధిని అంతర్ముఖముగా ప్రవేశపెట్టి, తద్వారా ఆత్మను గుర్తించేందుకు ప్రయత్నము చేయుటలేదు. పశువులకు బయటదృష్టి సహజము: మానవుల ప్రత్యేకత ఈ లోదృష్టి. మానవుని బయటదృష్టి హానికరముగామండును అన్నమునకు ప్రాకులాడక, ఆత్మను వెతికే బుద్ధిని అభివృద్ధిచేయుటయే మానవుని జీవితలక్ష్యము.

విద్యలను ఎంత సంపాదించినను, బలమెంతయుండినను, అధికారములెన్ని పొందినను, ప్రవర్తనద్వారా విజ్ఞాన, ప్రజ్ఞాన సుజ్ఞానములకొరకై ప్రాకులాడవలెను. ఇవి లేకుండుట, వ్యక్తిత్వమునకే అవమానము.

ఆహార విహారముల నిమిత్తమే జీవితమనుకొన్నచో, మనిషిగా పుట్టనక్కరలేదు. కుక్కలు, నక్కలు ఆ ఉద్దేశ్యమును నిర్వహించును: అన్నము వెదకేవాడు పాపి, ఆత్మను వెదకేవాడు గోపి, అని గోపికల విషయమై భాగవతములో పేర్కొన్నారు కూడ,

చిత్తవృత్తులను కామక్రోధములను చిమ్మచీకటినుంచి విడుదల చేసేదే ఆధ్యాత్మిక క్రమశిక్షణయొక్క పరమోద్దేశము. మానవులు, కామమువలన, రాముని మరచిపోదురు. క్రోధమే, కామమునకు వెంట జంట: ఇవిరెండు మానవుని దానవునిగా తయారుచేయును. పొగ కప్పిన నిప్పువలె, కామము చిత్తములో అణగియుండును. కామతృష్ణకు అంతులేదు.

వీటినుంచి విడుదల పొందవలెనన్న, వాటి మూలస్థానమేదో కనుగొనుటకు ప్రయత్నించవలెను. అప్పుడు ఇంద్రియములు, ఇంద్రియములననుసరించే మనస్సూ, కామ క్రోధముల కాధార మని తెలియును. దీనికే పెద్దలు ఇంద్రియనిగ్రహము నుపదేశింతురు. క్షణభంగురమైన విషయవాసనలకు మనోబుద్ధులనంకితముచేసి, వాటిని ఇంద్రియముల మూలకముగా బాహ్యప్రపంచమున విహరింపజేసి, మానవులు అశాంతిలోపడి, పవిత్రమైన ప్రశాంతికి దూరమై పోవుచున్నారు. జీవిత సైకతముపై పెనుగాలి మేడ నిర్మించి అదే శాశ్వతమని మానవుడు విశ్వసించి అజ్ఞానిగా తయారైపోవుచున్నాడు. జగత్తులోని ప్రతి పదార్థము స్థిరము కాదు : ఏ ఒక్కటికూడ మానవునకు దక్కేది కాదు : అవన్నీ యెండమావులు మానవుని బుద్ధిని మోసగించి భ్రమింపజేసి విరాశలో ముంచివేయునని తెలిసికొనేదే ఆధ్యాత్మికముయొక్క ప్రథమసోపానము.

ప్రతియొక్కరికి మానసికశాంతి అత్యవసరము ; ధనము, మదము, అధికారము, దేహబలము వీటివలన లభించేది అశాంతి కాని, శాంతికాదు : శాంతిదొరకవలెనన్న, ఒక దైవ భావ మే వానికి తగిన ఉపాయము.

కొంతమంది "సత్యాన్వేషణ" కు పూనుకో వలెనని, ఉపదేశింతురు, సత్యమే తన స్వరూపము, కాబట్టి, దానిని అన్వేషించ నక్కరలేదు, దానిని గుర్తించితే చాలు ; సత్యమే తానని తేలును. సత్యప్రకటనమును చేయుటకు పూనుకొనవలెను కాని, అన్వేషణము అనవసరము.

మానవుని సత్యత్వము, దివ్యత్వమే. దీనిని ప్రకటించు నిమిత్తము మహర్షులు, మహనీయులు పర్వదినములను యేర్పరచి నారు ; మహాశివరాత్రియొక్క ఉద్దేశముకూడను ఇదియే.

ప్రొఫెసర్ గోకాక్ ఇపుడు మీకు మహాశివరాత్రియొక్క విశిష్టతను గురించి తెలిపిరి, కదా ? శివుడు, హాలాహలమును మ్రింగి జగత్తును రక్షించిన దినము. తాండవనృత్యము సలిపిన దినము. ప్రథమముగా లింగాకారమును దాల్చిన దినము అని పురాణములు ఈ పవిత్రదినమును కొనియాడుచున్నవి.

ఇవన్ని కథలమూలకముగా ఆదర్శములనందించి, మానవునికి తన నిజస్థానమును గుర్తింపజేసే కొరకేగాని. వేరు కాదు. అందని చందమామను వ్రేలితో చూపినట్లు, అనుభవములను ఆశయములద్వారా ఆదర్శములను హృదయమున నాటుకొను చేసే ప్రయత్నములు.

ఉదాహరణమునకు శివరాత్రినాడు జాగరణ, ఉపవాసవ్రతములు అంటున్నాము. నవనాగరికతలో పడినవారు ఈరాత్రి మూడు లేక నాలుగు సినిమాలకు వెళ్ళుచున్ని లేదా పేకాట్లను తెల్లవారేవరకు ఆడి, జాగరణ నిర్వహింతురు. చేపలపైనే దృష్టిమంచి యేకాగ్రతతో ఒంటికాలుపై నిలుచు కొంగకు మోక్షమగునా ? కల్లుసారాయిత్రాగి మతిచెడిన అది తన్మయత్వమనిపించునా? భార్యపై క్రోధించి భోజనము మాని పస్తుపరుండిన అది ఉపవాసమగునా?

(సశేషం)

## పుస్త[illegible]

1 పుస్తకముల వెలయూ పోస్టు మరియు రిజిస్ట్రేషను చార్జీలను మనీ యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే [illegible] పుస్తకములు పంపించగలము.

2 నిలువలోనున్న పుస్తకములు వాటి పోస్టు చార్జీలు క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిస్టర్డు బుక్ పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలయూ పోస్టుచార్జీ మరియు ప్రతి ఆర్డరుతోను రిజిస్ట్రేషను ఛార్జీ రూ. 1-05పై జతపరచి, కావలసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| **తెలుగు:-** | | | |
| 1. | సత్యంశివం సుందరం(1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-15 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 11. | సాయిబాముదెవరు | 1-00 | 0-10 |
| 12. | బోధామృతము | 0-50 | 0-10 |
| 13. | సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | |
|---|---|---|
| 14. భజనావళి | 1-00 | 0-20 |
| 15. దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16 స్తుతి తరంగిణి (2వ భా) | 0-60 | 0-10 |

కన్నడం:——

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:——

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం (2) | 4-00 | 0-40 |
| 2. 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. వచోరత్నంగళ్ (1) | 2-00 | 0-20 |
| 5. ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. డివైన్ వాలి టు ది స్టూడెంట్సు | 1-00 | 0-15 |
| 8. ధర్మ వాహిని | 1-00 | 0-10 |
| 9. జ్ఞానోపదేశ రత్నాంగళ్ | 1-50 | 0-25 |

ఇంగ్లీషు. —

| | | |
|---|---|---|
| 1. సత్యసాయి స్పీక్స్ (1భా) | 4-00 | 0-25 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0 30 |
| 3. | .. .. (3భా) | 4-00 | 0-30 |
| 4. | ,, .. (4భా) | 5-00 | 0-40 |
| 5. | .. .. (5భా) | 5-00 | 0-40 |
| 6. | .. .. (6భా) | 5-00 | 0-40 |
| 7. | ,, .. (7భా) | 7-00 | 0-65 |
| 8. | సెలక్టెడ్ జ్యూయల్స్ (పద్యములు) | 1-50 | 0-10 |
| | సాయిబాబా [అమెరికన్ ఎడిషన్ సత్యం శివం సుందరం (1)] | | 0-40 |
| 10. | ప్రశాంతి వాహిని | 2-00 | |
| 11. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 12. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 13. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 14. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 15. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 16. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 17. | భజన్ సాంగ్స్ | 2-00 | 0-20 |

అరవం:——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్ వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ భా) | 3-50 | 0-40 |
| 4. | .. (2వ భా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-16 |
| 6. | అవతార మొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయిమాల | 1-00 | 0-10 |

| | | | |
|---|---|---|---|
| 9. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. | సందేహనివారిణి | 2-00 | 0-25 |

హిందీ:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

బెంగాలి:——

| | | | |
|---|---|---|---|
| 1. | ధ్యానవాహిని | 1-75 | 0-10 |

గుజరాతీ:——

| | | | |
|---|---|---|---|
| 1. | [illegible]స్కృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | [illegible]సుధ | 2-00 | 0-15 |

సింధి:——

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |
| 3. | ప్రశాంతివాహిని | 1-50 | 0-10 |
| 4. | సత్యం శివం సుందరం (2వ భా) | 4-00 | 0.40 |

మేనేజర్. సనాతన సారథి



Statement of Ownership and other Particulars about
SANATHANA SARATHI (Telugu)
as required under RULE 8 of the Registration
of Newspapers (Central) Rules, 1965.

FORM IV

| | |
|---|---|
| 1. *Place of Publication* | Prasanthi Nilayam Anantapur Dist. (A.P.) |
| 2. *Periodicity of Publication* | Monthly |
| 3. *Printer's Name* | N. KASTURI, M.A.,B.L. |
| *Nationality* | INDIAN |
| *Address:* | Prasanthi Nilayam |
| 4. *Publisher's Name* | B.V. RAJA REDDY for Sri Sathya Sai Trust |
| *Nationality* | INDIAN |
| *Address:* | Prasanthi Nilayam |
| 5 *Editor's Name* | N. KASTURI M.A.,B.L. |
| *Nationality* | INDIAN |
| *Address:* | Prasanthi Nilayam |
| 6. *Name and Address: of indiviauals who own the newspaper& Partners or share-holders holding more than one percent of the total capital.* | Sri Sathya Sai Trust Prasanthi Nilayam |

I B.V. Raja Reddy, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Prasanthi Nilayam
March 16: 1972

Sd. B.V. Raja Reddy
Publisher
for Sri Sathya Sai Trust

# గమనిక - పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలలో మాత్రమే సనాతన సారథి' మాసపత్రిక ప్రచురింపబడుచున్నది.

2. చందాలను పంపించునప్పుడే ఈ క్రింది వివరములను సుస్పష్టముగా తెల్పవలెను.

ఎ) మొదటిసారిగా చందాలను పంపేవారు "క్రొత్త చందాదారు", అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువు పొడిగించుటకు, తమ చందా నెంబరును పంపించు నప్పుడు తమ మునందే తెలియజేయవలెను.

సి) తెలుగు పత్రిక కావలెనో లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగా వ్రాయవలెను.

డి) చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయవలెను. M.O. ద్వారా చందాను పంపించువారు వారి పేరును పూర్తి విలాసము M.O. కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని పుస్తకములుగాని V P.P ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను.
M. O. ద్వారా పైకమును పంపించువారు కూపనులోనే కావలసినపుస్తకముల వివరములను తెలియజేయవలెను.)

4. పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను. "సనాతన సారథి", ప్రశాంతినిలయం పోస్టు, అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు పంపవలెను. చెక్కులను పంపేవారు బ్యాంకిఖర్చులనుకూడా కలిపి, మొత్తమును పంపవలెను. పత్రికగాని లేక, పుస్తకములుగాని చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5, పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయంపోస్టు, అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్, అను చిరునామాకు వ్రాయవలెను. అట్లు వ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమ చందానెంబరును లేక బుక్ ఆర్డరు నెంబరును తప్పక వ్రాయవలెను. అట్లువ్రాయనియెడల జవాబులిచ్చుటకు ఆలస్యమగును.

6, పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

ఆంధ్రప్రదేశ్ అనంతపురంజిల్లా ప్రశాంతినిలయము నందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయము నందు ఎన్. కస్తూరి గారిచే ముద్రింపబడి టి.వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయి ట్రస్టు తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్, ఎన్. కస్తూరి ఎం. ఏ., బి. ఎల్.